ఈగురుతును ఒప్పగించెదమువగ.

అపోస్తులలోగా ప్రధాన అపోస్తులుగానుండెడు అర్చ్యశ్రీష్టరాయప్పగారా, మేముచేసిన ఈపద.....పదివజ్రములవలనేశా. ౧-శ్లోకి

నాలుగవది.

మీాదివ్యకుమారుడు పుట్టిన నలుబదియవనాడు, వారిని గుడికికానుకగా కొనిపోయినపుడు, అక్కడ సిమియోన్, అన్నమ్మ యనెడు ఇద్దరు దీర్ఘదర్శులు మీాదివ్యకుమారుని లోకరక్షకుడని తెలిసి సేవించిన సమయమందు అర్చ్య...సంతోషమును
... ౧౦-ప్రియ., ౨-త్రిత్వ

ఈగురుతును ఒప్పగించెదమువగ.

అపోస్తులలోగా ప్రధాన అపోస్తుగానుండెడు అర్చ్యశ్రీష్టయాగప్పగారా, మేముచేసిన ఈపది...పదిమాణిక్యములవలనే
... ౧-శ్లో.

ఐదువది.

మీాదివ్యకుమారునికి పండ్రెండేడ్ల ప్రాయము నడుమనప్పుడు, జెరూసలేము పట్టణమునకు పాస్కపండుగను కొనియాడ పోయి, అక్కడ స్వామిని గానక, మూడునాళ్ళు వెతికి, మూడవనాడు గుడిలో వేదశాస్త్రుల సభామధ్యములో వారిని చూచిన సమయమందు అర్చ్య...సంతోష.....౧౦-ప్రియ., ౨-త్రిత్వ.

ఈగురుతు ఒప్పగించెదమువగ.

అపోస్తులలోగా ప్రధాన అపోస్తులుగానుండెడు అర్చ్యశ్రీష్టఅర్లప్పగారా, మేముచేసినఈపది...పదిరత్నములవలనే౧శ్లో

ఏబదిమూడు పూసల జపము. ఒప్పగించెదమువగ.

అతిదూతలైన అర్చ్యశ్రీష్ట మిఖయేలా, దేవదూతలైన

అర్చ్య. గాబ్రియేలా, అపోస్తులైన అర్చ్య. రాయప్ప, అర్లప్ప, యాగప్ప, అనేకు వారలారా, మేమెంత పాపాత్ములుగానుండి ననుమేము వేడుకొన్న ఈ యేబదిమూడుపూసల జపమును అర్చ్య. దేవరతల్లి పాదాలయందు మీ స్తోత్రములతో నొకటిగాచేర్చి కానుకగా సమర్పించండని మిమ్ముజూచి ప్రార్థించుచున్నాము.

మంగళవారము, శుక్రవారములలో చెప్పుట.

దుఃఖ దేవరహస్యములు.

మొదటిది.

మీదివ్యకుమారుడు శృంగారతోపులో దుఃఖమురొంబ మహాచింతచేత శరీరమంతా రక్తచెమట చెమర్చిన సమయమందు అర్చ్య. దేవరతల్లీ మీకు వచ్చిన దుఃఖమును తలంచి జపముచేయుచున్నాము. 10-ప్రి

ఈగురుతును ఒప్పగించెదువగ.

సన్మనస్సులలోగా ప్రధాన సన్మనస్సుడుగా నుండెడు అర్చ్య. మిఖాయేలు సన్మనస్సుడైనవారా మేముచేసిన. ఈ 10-పూసల పదిపువ్వులవలనే.

రెండవది.

మీదివ్యకుమారుని రాతిస్తంభమునకుకట్టి జాదులునిష్ఠూరముగా కొట్టినసమయమందు అర్చ్య. దేవరతల్లీ మీకువచ్చిన దుఃఖమును తలంచి జపముచేయుచున్నాము. 10-ప్రి

ఈగురుతును ఒప్పగించెదువగ.

సన్మనస్సులలోగా ప్రధాన సన్మనస్సుడుగా నుండెడు అర్చ్య గాబ్రియేలు సన్మనస్సుడైనవారా మేముచేసిన ఈపది పూసల... పదిముత్యముల వలెనే కానుకగా సమర్పించండని మిమ్ముజూచి ప్రార్థించు.। 1-జ్యోతి.

మూడవది.

మీదివ్యకుమారుని శిరస్సుమీద ముండ్లకిరీటమును అది మిపట్టికోట్టి పరిహాసరాజవేషముతో వారిని నామలు అవమానముచేసిన సమయమందు అ: దేవ: మీకువచ్చినదుఃఖ తలంచి జపముచేయుచున్నాము 10-వి

ఈగురుతును ఒప్పగించెనువగ.

అపోస్తలలోగా ప్రధాన అపోస్తులుగా నుండెను అర్చ్య. రాయప్పగారా మేముచేసిన ఈవదిపూసల పదివజ్రములవలెనే కానుకగా... 1-జ్యోతి.

నాలుగవది.

మీదివ్యకుమారుని భుజముమీద భారమైన స్లీవమ్రానును మోపి కపాలకొండకు జూడులునడిపించుకొని పోవుటను మీరు జూచిన సమయమందు అర్చ్య. దేవరతల్లీ మీకువచ్చిన దుఃఖమునుతలంచి జపము:

10-ప్రి.

ఈగురుతును ఒప్పగించెనువగ.

అపోస్తులలోగా ప్రధాన అపోస్తులుగా నుండెను అర్చ్య. యాగప్పగారా మేముచేసిన ఈవదిపూస: పది మాణిక్యములవలెనే కానుకగా.

1-జ్యోతి.

ఐదవది.

మీదివ్యకుమారుడు కపాలకొండమీద స్లీవమ్రానిలో కొట్టబడి మనుష్యులుచేసిన పాపములకొరకు మరణముపొందిన సమయమందు అర్చ్య. దేవరతల్లీ మీకువచ్చిన దుఃఖమును తలంచి జపముచేయు. 10-ప్రి.

ఈగురుతును ఒప్పగించెదువగ.

అపోస్తులలో ప్రధాన అపోస్తులుగా నుండెడు అర్చ్య. అర్లప్పగారా మేము చేసిన ఈపదిపూసల...పది రత్నములవలెనే కాబు...నను... 1-జోృతి.

బుధ, శని, ఆదివారములలో చెప్పట.

మహిమ దేవరహస్యములు.

మొదటిది.

మీాదివ్యకుమారుడు మరణముపొందిన మూడవనాడు ఆత్మశరీరముతో జీవంతుడై లేచి మీాకు కనుబడిన సమయమందు అర్చ్య. దేవరతల్లీ మీాకువచ్చిన మహిమను తలంచి జపము చేయుచున్నాము. 10-ప్రి.

ఈగురుతును ఒప్పగించెదువగ.

సన్మనస్కులలోగా ప్ర: అర్చ్య. మిఖయేలుసన్మ: మేము చేసిన ఈపది అ. దేవ...పదిపువ్వు.

1-జోృతి.

రెండవది.

మీాదివ్యకుమారుడు లేచిన నలుబదియవనాడు మహా ఒడ్డోలకముగా మోక్షారోహణము చేసిన సమయమందు అర్చ్య దేవరతల్లీ మీాకువచ్చిన మహిమను తలంచి జపముచేయుచు న్నాము. 10-ప్రి

ఈగురుతును ఒప్పగించెదువగ.

సన్మనస్కులలోగా ప్రధాన సన్మనస్కుడుగా నుండెడు అర్చ్య. గాబ్రియేలు సన్మనస్కుడై నవారా మేముచేసిన ఈపది పూసల: పదిముత్యములవలెనే:

1-జోృతి.

మూడవది.

స్పిరితుసాంతువై న సర్వేశ్వరుడు, మీామీాదనును, స్వా మిరియొక్క శిష్యులమీాదను, అగ్నిజ్వాలల రూపముగా దిగికను బడిన సమయమందు అర్చ్యు. దేవరతల్లీ మీాకువచ్చిన మహి మను తలంచిజపము.

10-ప్రి.

ఈగురుతును ఒప్పగించెదువగ.

అపోస్తులలోగా ప్రిధాన అపోస్తులుగానుండెడు అర్చ్యు. రాయప్పగారా సేముచేశిన ఈపది...పది వజ్రిములవలెనే కా ణుకగా సమర్పించండని. 1-జ్యో.

నాలుగవది.

మీారు మరణముపొందిన మూడవనాడు ఆత్మశరీరముతో మహా ఓడ్డోలకముగా మోక్షారోహణము చేయుబడిన సమయ మందు అర్చ్యు. దేవరతల్లీమీాకు వచ్చిన మహిః తలంచి జపము చేయుచున్నాము. 10-ప్రి.

ఈగురుతును ఒప్పగించెదువగ.

అపోస్తులలోగా ప్రిధాన అపోస్తులుగానుండెడు అర్చ్యు. యాగప్పగారా సేముచేసిన ఈపది...పదిమాణిక్యముల వలెనే కాణుకగా సమర్పి.................................... 1-జ్యోతి.

ఐదవది.

పితృమైన సర్వేశ్వరుడు, మీాకు పరలోక భూలోకరాజ్య పట్టముకట్టిన సమయమందు అర్చ్యు. దేవరతల్లీ మీాకు వచ్చిన మహిమను. 10-ప్రి.

ఈగురుతును ఒప్పగించెదువగ.

అపోస్తులలోగా ప్రిధాన అపోస్తులుగానుండెడు అర్చ్యు.

అర్లప్పగారా మేముచేసిన ఈపదిపూసల జపము ను అర్చ్య. దేవ రతల్లి దివ్యపాదములయందు పదిరత్నములవలెనే కానుకగా సమ ర్పించవలెనని మిమ్ములవేడి. ప్రార్థించుచున్నాము. 1-జ్యోతి:

దేవరతల్లి ప్రార్థన.

స్వామీ కృపగాఉండండి,
క్రీస్తువా కృపగాఉండండి,
స్వామీకృపగాఉండండి,
క్రీస్తువా మాప్రార్థన వినవధరించండి,
క్రీస్తువామాప్రార్థనప్రకారముదయచేయుండి,
పరలోకమందుండెడు పితయైనసర్వేశ్వరా,
లోకమురక్షించిన సుతుడైనసర్వేశ్వరా,
స్పిరితుసాంతువైన సర్వేశ్వరా,
అర్చ్య. త్రిత్వంతులై యుండెడు ఏకసర్వేశ్వరా,
అర్చ్యశిష్ట మరియమ్మా,
సర్వేశ్వరునియొక్క అర్చ్యమాతా
కన్యకలయొక్క అర్చ్య-కన్యకా,
క్రీస్తువయొక్కమాతా,
దేవయిష్టప్రసాదముయొక్కమాతా,
మహాపరిశుద్ధమాతా,
మహావిరక్తిగానుండెడుమాతా,
నిర్మలమైనమాతా,
కన్యశుద్ధము చెడనిమాతా,
స్నేహమునకు తగినమాతా,
ఆశ్చర్యమునకు తగినమాతా,
మందిఆలోచనయొక్కమాతా,

సన్మనస్కులయొక్క రాజ్ఞీ,
పితాపితృలయొక్క రాజ్ఞీ,
దీర్ఘదర్శులయొక్క రాజ్ఞీ,
అపోస్తులయొక్క రాజ్ఞీ,
వేదసాక్షులయొక్క రాజ్ఞీ,
స్తుతియులయొక్క రాజ్ఞీ,
కన్యాస్త్రీలయొక్క రాజ్ఞీ.
సకలఅర్చ్యశిష్టులయొక్క రాజ్ఞీ,
జన్మపాపములేక ఉద్భవించిన రాజ్ఞీ,
మహాపరిశుద్ధ జపమాల రాజ్ఞీ,
సమాధానముయొక్క రాజ్ఞీ,

మాకొరకు ప్రార్ధించుము.

లోకముయొక్క పాపములను పరిహరించెడు సర్వేశ్వరుని యొక్క దివ్య గొర్రెపిల్లయైన యేసువా! మాపాపములను ఓర్వ నవధరించండి స్వామీ.

లోకముయొక్క పాపములను పరిహరించెడు సర్వేశ్వరుని యొక్క దివ్య గొర్రెపిల్లయైన యేసువా! మాప్రార్థన ప్రకారము దయచేయండి స్వామీ.

లోకముయొక్క పాపములను పరిహరించెడు సర్వేశ్వరుని యొక్క దివ్యగొర్రెపిల్లయైన యేసువా! మాకుదయచేసి రక్షించండి స్వామీ.

వ- యేసుక్రీస్తు నాధుని వాగ్దత్తములకు మేము పాత్రుల మగునట్లు.

ఉ- సర్వేశ్వరునియొక్క అర్చ్యశిష్టమాతా, మాకొరకు వేడుకొనండి.

## ప్రార్థించుదము.

జగద్రక్షకులైన దేవుని మీస్త్రీపకింద నిలిచియుండిన మీదివ్యమాతను, మీప్రియశిష్యునికి తల్లిగాపాలించితిరే. ఇదుగో మాకును ఇంతటి సాదృశ్యమును అనుగ్రహించి, దేవరవారు కాలపరిమాణమందు, నిజమైన మనుష్యుడై జన్మించ తెలిసికొనిన అటువంటి అమ్మవారియొక్క బిడ్డలుగాఉండెను భాగ్యము మా కెప్పటికిని ప్రాప్తింపచేయ నవధరించండిస్వామీ. ఆ. జే.

## కృపారసమంత్రము చెప్పుట.

అర్చ్యశిష్టబెర్నార్డు దేవమాతను జూచి వేడుకొనిన జపము.

మిక్కలి నెనరుగలతల్లీ, మీశరణముగా వరుగెత్తివచ్చి మీ యుపకార సహాయములను బతిమాలి మీ వేడుకల సహాయమును అడిగిన వారలయందు ఒకరైనను మీవలన చైవిడువబడినట్టు ఎన్నడును లోకములో వినినది లేదనితలంప నవధరించండి కన్యకల రాజ్ఞియైన కన్యకా ! కరుణారసముగల తల్లీ ! ఇటువంటి నమ్మికచేత ప్రేరేపింపబడి, మీ దివ్యపాదములను సమీపించి వచ్చుచున్నాను. నిట్టూర్పువిడిచి ప్రలాపించి ఏడ్చెడు పాపియైన నేను మీదయాళమునకు కాచుకొని మీసముఖములో నిలుచున్నాను. అవతరించిన వాక్యరయొక్కతల్లీ ! నావిజ్ఞాపనమును త్యజింపక దయాపరిరై వినవతధరించండి.

జన్మపాపములేక ఉద్భవించిన అర్చ్యశిష్ట మరియమ్మా పాపులకుశరణమా ! ఇదిగో వరుగెత్తివచ్చి, మీశరణుజొచ్చితిమి. మాబిడ్డనెనరుగానుండి, మాకొరకు మీదివ్యకుమారుని వేడుకొనండి.

ఉత్తరించు ఆత్మలకు చెప్పసంగీతము.

యేసువా మీ మధురమయిన హృదయమును అధికలోగా స్నేహింతునుగాక. యీమంత్రమును మూడుమారులు చెప్పవలయును.

ఉత్తరించు ఆత్మలకు చెప్పసంగీతము.

స్వామీ! పాతాళమునుండి మిమ్ము ఎలుగెత్తి పిలుచుచున్నాను! స్వామీ! నా కంఠధ్వనిని ఆలకించ నవధరించుము:— నా విన్నపములయొక్క శబ్దమును మీ చెవులిచ్చి విననవధరించండి పితినవారా! పాపములను గమనించితిరైన, మీ ఎదుట నిర్వాకము చేయ గలవాడెవడు:— అయితే దేవరవారియొద్ద దయాళమైన క్షమయుంచుటవల్లనున్ను, మీ వేత నియమము నిమిత్తమై, స్వామీ మిమ్ము నమ్మి కాచుకొని యున్నాను:— నా యాత్మము వారి దివ్యవచనము మీద ఊనియున్నది. నా యాత్మము వారియందు నమ్మికనుంచియున్నది:— ప్రాతఃకాల జాముమొదలుకొని రాత్రివరకు ఇస్రయేల్ జనము పితినవారిని నమ్మి కాచుకొని యుండునుగాక:— ఏలనంటే, స్వామి దయగలవారు వారియొద్ద రక్షణ్యము పరాకమున్నది:— వారే ఇస్రయేల్ జనమును తాని సకలపాపములనుండి రక్షించుదురు.

వ.— పితినవారా! వారలకు నిత్యవిశ్రామమును దయచేయండి.

ఉ.— నిత్యప్రకాశము వారలకు ప్రకాశించునుగాక.

వ.—వారలు సమాధానమందు విశ్రమింతురుగాక.

ఆమెన్-జేసు.

ప్రార్థించుదము.

సమస్తుల విశ్వాసుల సృష్టికుడును రక్షకుడునైన సర్వేశ్వరా, మీదాసుల ఆత్మలకు సమస్తపాపనివారణమును కరుణించండి. వారలెప్పుడును అపేక్షించిన మన్నింపును మా భక్తిగల వేడుకల చేత పొందచేయ నవధరించండి. పితతోనున్ను స్పిరితుసాంతుతోనున్ను సదాకాలము జీవితులున్ను రాజ్యపరిపాలకులునైన ఏలినవారా! ఆమెన్-జేసు.

వ.—విశ్వాసుల ఆత్మలు సర్వేశ్వరుని దయచేత సమాధానమందు విశ్రమింతురుగాక. అం. ఆ. జే.

---

## దైవికపుణ్యక్రియలు.

### విశ్వాసక్రియ.

నా సర్వేశ్వరస్వామీ, అర్చ్య. సభ విశ్వసించి చదివించెడి సత్యము లన్నిటిని సత్యస్వరూపిగానుండు దేవరవారు తామే తెలియచేసినందువల్ల నేనును దృఢముగా విశ్వసించుచున్నాను.

### నమ్మకక్రియ.

నా సర్వేశ్వరా స్వామీ, సర్వనమ్మకమునకు పాత్రులుగానుండు దేవరవారు వాగ్దత్తము చేసినందువల్ల యేసునాథస్వామి పాటుపడిన పుణ్యఫలమునుజూచి నా పాపములన్ని ఓర్చి నాకు మీ తోడుక్క వరప్రసాదములను మోక్షభాగ్యమును కృపచేయుదురని ముగా నమ్ముచున్నాను.

### దేవస్నేహక్రియ.

నా సర్వేశ్వరా స్వామీ, సకలమేలుల స్వభావముగానుండు

దేవరవారు యిట్టిలేను స్నేహమునను పాత్రులుగానుండుటవల్ల అంతటికన్న మిమ్ము నేను నింతుమనన్నుతో స్నేహించు చున్నాను. నా సర్వేశ్వరా మిమ్ము జూచి నన్ను నేను స్నేహించె దుపకారము నకు ప్రతిమలను నేను స్నేహించుచున్నాను. అ. కే.

# జ్ఞానోపదేశ సంగ్రహము.

## ఏకత్రిత్వ సర్వేశ్వరుని గురించి

గు. సర్వేశ్వరుడు కలడా?

శి. కలడు.

గు. ఎందరు సర్వేశ్వరులు?

శి. ఒక్కే సర్వేశ్వరుడు.

గు. వారెల్లా ఉన్నారు?

శి. త్రిత్వంతులై ఉన్నారు.

గు. త్రిత్వంతులై ఉన్నారనేటందుకు అర్థమేమి?

శి. పితా, సుతుడు, స్పిరిత్తుసాంక్తు, ముగ్గురై ఉండినా, దేవస్వభావములో ఒక్కే సర్వేశ్వరుడై ఉన్నారు.

గు. పిత, సర్వేశ్వరుడా?

శి. సర్వేశ్వరుడు.

గు. సుతుడు, సర్వేశ్వరుడా?

శి. సర్వేశ్వరుడు.

గు. స్పిరిత్తుసాంక్తు సర్వేశ్వరుడా?

శి. సర్వేశ్వరుడు.

గు. ముగ్గురు సర్వేశ్వరులా, ఒక్కే సర్వేశ్వరుడా?

శి. ఒక్కే సర్వేశ్వరుడు.

గు- ఏలా ఒక్కే సర్వేశ్వరుడు కలడని చెప్పుచున్నావు?

శి- వీరిముగ్గురికిన్ని ఒక్కే బుద్ధి, ఒక్కే జ్ఞానం, ఒక్కే బలిమి, ఒక్కే దేవస్వభావముకలిగి ఉన్నవి గనుక దేవస్వభావములో ఒక్కే సర్వేశ్వరుడై ఉన్నారు.

గు- వీరిలో ముందటివారున్ను, వెనుకటివారున్ను కలరా?

శి- లేదు.

గు- ఎందువల్ల లేదు?

శి- పితఅనాది, సుతుడు అనాది, స్పిరితుసాంక్తు అనాది, ఈముగ్గురున్ను అనాదిగా ఉండుటవలన వీరిలో, ముందటివారు లేరు వెనుకటివారులేరు.

గు- ఇటువంటిస్వామిని కనిపెట్టేటందుకు, ఎన్నిలక్షణములుకలవు?

శి- ఆరులక్షణములు కలవు.

గు- అటువంటి ఆరులక్షణములువవి?

శి- సర్వేశ్వరుడు స్వయంభు తానైయున్నారు మొదలైనవి.

గు- 1వ సర్వేశ్వరుడు స్వయంభు తానైఉన్నారనేటందుకు అర్థమేమి?

శి- స్వామిఒకరిచేత సృష్టింపబడినవారు కారు.

గు- 2వ అనాదిగా ఉన్నారనేటందుకు అర్థమేమి?

శి- ముందరలేక వెనక వచ్చినారని చెప్పక ఎప్పటికిని ఆదిఅంతములేక ఉన్నారు.

గు- 3వ శరీరములేక ఉన్నారనేటందుకు అర్థమేమి?

శి- శరీరము కలిగితే పుట్టున్ను ముగింపున్ను కొదవలున్ను హీనమున్ను కలిగివున్నవి గనుక దేవునికి పుట్టులేదు ముగింపులేదు వారికి శరీరమున్ను లేదు.

గు. 4వ కడగురుతులేని సకలమేలుల స్వభావముగా ఉన్నారనే
టందుకు అర్థమేమి?

శి. మట్టులేనినీతి మట్టులేనిదయ మట్టులేని సంతోషము
మట్టులేని సకలమేలుల స్వభావముగా ఉన్నారు.

గు. 5వ ఎందున్ను వ్యాపించి ఉన్నారనేటందుకు అర్థమేమి?

శి. జ్ఞానముచేతనున్ను బలిమి చేతనున్ను కారణము చేత
నున్ను ఎందున్ను వచ్చేటి కార్యములు ఎరిగి చూచు
కొని రక్షించుకొని నడిపించుకొని వస్తున్నారు.

గు. 6వ అంతటికిన్ని ఆదికారణమై ఉన్నారనేటందుకు అర్థమేమి?

శి. సర్వమున్ను సృష్టించి సర్వానికిన్ని ఆదికారణమైయున్నారు

గు. ఈరాజ్యమున ఆరాధన చేయబడేటి దేవతలయందు
యిటువంటి సత్యమైన దైవగురుతులు కలవా?

శి. లేదు.

గు. సర్వేశ్వరుడు త్రిత్వంతులై ఉన్నారని చెప్పితివే పితా,
సుతుడు, స్పిరితుసాంక్తు ముగ్గురిలో మనుష్యావతారము
ఎత్తినవారు ఎవరు?

శి. రెండవవారైన సుతుడైన సర్వేశ్వరుడు.

గు. ఏలామనుష్యావతారము యెత్తినారు?

శి. పాపముచేత చెడిపోయిన మనుష్యులందరిని రక్షించేటం
దుకు (నిమిత్తము.)

గు. ఎవరుచేసిన పాపముచేత మనుష్యులందరు చెడిపోయి
నారు?

శి. ఆదితల్లి, ఆదితండ్రిచేసిన పాపముచేత మనుష్యులందరు
చెడిపోయినారు.

గు. చెడిపోయినారనేటందుకు అర్థమేమి?

ఉ. స్వామియొక్క ఇష్టప్రసాదవరములున్ను మోక్షసంప్రాప్తిమున్ను దేవరతల్లికి సినహా మనుష్యులందరికి తప్పిపోయినది. అదేజన్మపాపము.

ప్ర. మనుష్యావతారము చేసిన రెండవవారైన సుతుడైన సర్వేశ్వరుడు లోకప్రకారము పుట్టినారా వేరేప్రకారము పుట్టినారా?

ఉ. వేరేప్రకారము పుట్టినారు.

ప్ర. వేరేప్రకారము ఎట్లాపుట్టినారు?

ఉ. స్పిరితుసాంతు అనుగ్రహముచేత ఎప్పుడున్ను పరిశుద్ధకన్యాస్త్రీగాఉండే అర్చ్యశిష్ట కన్యమరియమ్మగారి గర్భములో ఉద్భవించి వారికన్య ముద్రమహిమ చెడకుండాపుట్టినారు.

ప్ర. వారుపుట్టిన ఎనిమిదవనాడు వారికేమి పేరుపెట్టినారు?

ఉ. జేసువనే పేరుపెట్టినారు.

ప్ర. జేసువనేపేరుకు అర్థమేమి?

ఉ. మనలను రక్షించేటివారు.

ప్ర. జేసుక్రీస్తునామధేయమునకు అర్థమేమి?

ఉ. సర్వానికిన్ని కర్తలున్ను అందరికిన్ని పరమగురువులున్ను నిజమైన సర్వేశ్వరుడున్ను నిజమైనమనుష్యుడున్ను ఒక్కరుగా ఉండేటి జేసునాథస్వామి.

ప్ర. జేసునాథస్వామికి ఎన్నిస్వభావములుకలవు?

ఉ. రెండుస్వభావములు కలవు.

ప్ర. అటువంటి రెండుస్వభావములకు అర్థమేమి?

ఉ. దేవస్వభావమున్ను, మనుష్యస్వభావమున్ను.

ప్ర. జేసునాథస్వామి పాటుబడినారా?

ఉ. పాటుబడినారు.

గు- ఏస్వభావములో పాటుబడినారు?

శి- మనుష్యస్వభావములో పాటుబడినారు.

గు- మనుష్యస్వభావములో ఎట్లాపాటుబడినారు?

శి- స్త్రీవయందు మొలలచేత కొట్టబడి కఠినమైనమరణముపొంది సమాధిలో స్థాపించబడినారు.

గు- వారు మరణము పొందినవెనక వారిదివ్యమైన ఆత్మ ఎక్కడికిపోయెను?

శి- పాతాళమునకు పోయెను.

గు- పాతాళమునందు ఎన్నిస్థలము లుకలవు?

శి- నాల్గుస్థలములు కలవు.

గు- అటువంటినాల్గుస్థలములు ఏవి?

శి- 1ది నరకము.
2ది ఉత్తరించేస్థలము.
3ది పశిబిడ్డలస్థలము.
4ది పితాపితృలస్థలము.

గు- 1ది నరకమని చెప్పితివే, నరకములో ఉండేవారు ఎవరు?

శి- పిశాచములున్ను, అజ్ఞానులున్ను సర్వేశ్వరుని ఎరుగనివార్లున్ను ఎరిగినవారి చిత్తమునకు తగ్గట్లుగా నడవనిపాపాత్ములు ముగింపులేనికాలము అగ్నిలో పిశాచులతో కూడ నరకము. సదాకాలము బాధించపడుదురు.

గు- 2ది ఉత్తరించే స్థలమనేటందుకు అర్థమేమి?

శి- ఈభూలోకమున స్వామియొక్క ఇష్టప్రసాదములో మరణముపొందిన పుణ్యాత్ములు తాము చేసిన పాపములకుగాను ఇక్కడ ఉత్తరించనివారలు ఉత్తరించేస్థలములో ఉత్తరించి తుదకు మోక్షము పొందుదురు.

గు- 3ది పశిబిడ్డల స్థలమనేటందుకు అర్థ మేమి ?

శి- అజ్ఞానుల బిడ్డలైనా క్రీస్తువుల బిడ్డలైనా బుద్ధి తెలియక ముందే జ్ఞానస్నానము లేక చనిపోయిన పశిబిడ్డలకు మోక్షము లేదు నరకము లేదు, వారు మూడవ స్థలములో ఉన్నారు.

గు- 4ది పితాపిత్రుల స్థలమనేటందుకు అర్థ మేమి ?

శి- లోకారంభము మొదలుకొని యేసునాధస్వామి పాటుపడేవరకు మోక్షవాకిలి తెరవకుండా యున్నందువలన ఆకాలము వచ్చేవరకు పితాపిత్రుల స్థలములో కాచుకొని యుందురు.

గు- పితాపిత్రుల యొక్క స్థలానికి మనకర్తుడు యేసునాధస్వామి జీవాత్మ దిగిపోయి అక్కడనుండే పితాపిత్రులకు మోక్షమిచ్చి తిరిగి మూడోనాడు జీవాత్ములై లేచినారా ?

శి- లేచినారు.

గు- లేచి ఈ భూలోకమున ఎన్నాళ్ళున్నారు ?

శి- నలుబైనాళ్ళు ఉన్నారు.

గు- ఈ నలుబైనాళ్ళకులోగా మనకర్తుడు యేసునాధస్వామి ఏమి కలిగించినారు ?

శి- అనేకసార్లు తమ శిష్యులకు కనిపించి వాళ్లకు జ్ఞానబుద్ధులు చెప్పి దేవద్రివ్యానుమానములు కలిగించినారు.

గు- దేవద్రివ్యానుమానములు ఎన్ని ?

శి- 1ది జ్ఞానస్నానము.

2ది భద్రమాభ్యాంగము.

3ది పశ్చాత్తాపము.

4ది సత్ప్రసాదము.

5ది అవస్థాభ్యాంగము.

6ది గురుపట్టము.

7వ జ్ఞానవివాహము.

గు- 1వ జ్ఞానస్నానమనేటందుకు అర్థమేమి?

శి- జ్ఞానస్నానముచేత జన్మపాపమున్ను బుద్ధితెలిసిన వెనక చేసిన పాపములన్ని పరిహారమై పోయి తిరుసభలో సర్వేశ్వరుని బిడ్డలమవుచున్నాము.

గు- 2వ బద్రమైన భ్యాంగమనేటందుకు అర్థమేమి?

శి- బద్రమైనభ్యాంగముచేత సత్యోపదేశముచొప్పున సుముద్రిముగా నడచేటందుకున్ను ప్రపంచమున వచ్చేటి తంత్రములు జయించేటందుకున్ను వారికి కావలసిన దేవసహా బలిము వస్తున్నది.

గు- 3వ పశ్చాత్తాపమనేటందుకు అర్థమేమి?

శి- పశ్చాత్తాపముచేత జ్ఞానస్నానం పొందినవెనుక చేశినపాపములన్ని పరిహారమైపోవుచున్నవి.

గు- 4వ సత్ప్రసాదమనేటందుకు అర్థమేమి?

శి- గోధుమఅప్పముయొక్క గుణములలోనున్న ద్రాక్షపండ్ల రసముయొక్క గుణములలోనున్ను మనకర్త్తను యేసునాథస్వామి ఆత్మలోనున్ను శరీరములోనున్ను దివ్యరక్తములోనున్ను దైవత్వములోనున్ను కూడానిజముగా నేంచేసి వస్తున్నారనేదే దివ్యమైన సత్ప్రసాదము.

గు- 5వ అవస్థభ్యాంగమనేటందుకు అర్థమేమి?

అవస్థభ్యాంగముచేత మందిమా[illegible]పాం దేటందుకున్ను ఆసమయమున వచ్చేటితంత్రాలు జయించేటందుకున్ను వారికి కావలశిన ధైర్యమువచ్చుచున్నది.

గు- 6వ గురుపట్టమనేటందుకు అర్థమేమి?

శి- గురుపట్టము పొందినవారు ఇటువంటి దేవద్రవ్యాను

గు- యేసునాథస్వామివారును అపోస్తులులును ఎన్ని తిరుసభను స్థాపించినారు.

శి- కతోలిక్కానే ఒక్కతిరుసభను స్థాపించినారు.

గు- దానికి బైటనుండువారికి మోక్షము కలదా?

శి- లేదు.

గు- లేదనేటందుకు దృష్టాంతమేమి?

శి- తిరుసభయొక్క మాటవినని వాడు అజ్ఞానివలె నీకు అవును గాకయని కర్తుడు ఆనతిచ్చెను.

గు- ఇప్పుడు మన కర్తుడు యేసునాథస్వామి యెన్నిస్థలములందు వున్నారు.

శి- దేవస్వభావముచేత అంతటనువున్నారు మనుష్యుడైనట్టుకు రెండుస్థలములందు వున్నారు.

గు- అటువంటి రెండుస్థలములకు అర్థమేమి?

శి- 1వది పితావైన సర్వేశ్వరునియొక్క కుడిపార్శ్వమున కూర్చున్నారనేదమును.

2వది మనగురువులు నవపూజలో మంత్రించిన దివ్యమైన సత్ప్రసాదములోనువున్నారు.

గు- యింకా ముందర యెక్కడికి వేంచేతురు?

శి- లోకం ముగిసేటప్పుడు లోకన్యాయ నిర్ణయం తీర్చవత్తురు.

గు- లోకం యెట్లాముగియును?

శి- అగ్నిప్రళయముచేత లోకమంతా కాలిపోయి మనుష్యులందరు చచ్చిపోదురు.

గు- చచ్చిపోయిన మనుష్యులందరిని సర్వేశ్వరుడు తనయొక్క కడగురుతులేని బలిముచేత తిరుగా లేపునురా?

శి- లేపుదురు.

గు- జ్ఞానస్నానమిచ్చేది యెట్లా?

శి- 1 ది తిరుసభ జ్ఞానస్నానమిచ్చే తాత్పర్యముతో నేనున్ను జ్ఞానస్నానమిస్తున్నానని మనస్సులో తలంచుకొనేది 2 ది పిల్లలకు ఉంచవలసిన పేరు విశదముగా నుచ్చరించి ఆపిల్లతలమీద నీళ్ళుపోసేటప్పుడు చెప్పవలసినదేమంటే పితాయొక్కయున్ను సుతునియొక్కయున్ను స్పిరితుసాంక్తుయొక్కయున్ను నామముచేత నేనునిన్ను కడుగుతున్నాను. ఆమెన్ జేసు.

---

పాపసంకీర్తనమున్ను ప్రసాదకార్యముల గురించి

గు- పాపం పరిహారించేటందుకు ఎన్ని ముఖాంత్రములు కలవు?

శి- మూడు ముఖాంత్రములు కలవు.

గు- అటువంటి మూడుముఖాంత్రములు ఏవి?

శి- 1 ది జ్ఞానస్నానం. 2 ది మనస్తాపం. 3 ది పాపసంకీర్తనం.

గు- పాపసంకీర్తనమునకు ఎన్ని కార్యములు కలవు?

శి- ఆరుకార్యములు కలవు?

గు- అటువంటి ఆరుకార్యములకు అర్థమేమి?

శి- 1 ది చేసినపాపంలన్ని తలంచేది.

2 దితలంచిన పాపములకుగాను దుఃఖ మనస్థాపముగా ఉండేది.

3 ది ఇకమీదట యింక ఒక్కనాటికిని యిటువంటి పాపములను చేసేదిలేదని గట్టిమానస్సుతో ప్రతిజ్ఞచేసేది.

4 ది చేసిన పాపములన్ని గురువుతో ఒక్కటిన్ని దాచక చెప్పేది.

గు- ప్రసాదములో ఎవరు ఉన్నారు?

శి- జేసునాథస్వామి.

గు- ఎట్లాఉన్నారు?

శి- ఆత్మతోనున్న శరీరముతోనున్న దివ్యరక్తముతోనున్న దైవత్వముతోనున్నకూడా నిజముగావేంచేసి యున్నారు. అదేదివ్యమైన సత్ప్రసాదం.

గు- సత్ప్రసాదములో అప్పముకద్దా?

శి- అప్పములేదు అప్పగుణములుమాత్రం కలవు.

గు- అప్పముగుణాలు ఎట్లావుండును?

శి- తెల్లగాఉండును బిళ్ళగఉండును చక్రమువలెఉండును ఇటువంటి గుణాలుమాత్రం కలవు గాని సత్ప్రసాదములో అప్పములేదు.

గు- పాపములోఉండి సత్ప్రసాదముతియ్యవచ్చునా

శి- తియ్యరాదు.

గు- భోంచేసి నీళ్ళుత్రాగి సత్ప్రసాదము తియ్యవచ్చునా

శి- తియ్యరాదు.

గు- సత్ప్రసాదములో జేసుస్వామి ఉన్నారో లేరో అని సందేహముగా ఉండి సత్ప్రసాదము తియ్యవచ్చునా?

శి- తియ్యరాదు.

గు- సత్ప్రసాదము తీసేటందుకు ఎన్నిఆయత్తములు కావలెను?

శి- మూడు ఆయత్తములు కావలెను.

గు- అటువంటి మూడు ఆయత్తములు ఏవి?

శి- 1 ది ఆత్మఆయత్తము. 2 ది శరీరఆయత్తము 3 ది విశ్వాసము.

గు- ఆత్మఆయత్తమనగానేమి?

శి- [illegible] స్నానంతో [illegible] పాపముల మీద దుఃఖము [illegible] ఉండి [illegible] సత్ప్రసాదాన్ని [illegible]

గు- ఈ ముగ్గురిలో మనుష్యావతారం చేసినవారు ఎవరు?

శి- రెండవవారైన సుతుడైన సర్వేశ్వరుడు.

గు- ఎవరికొరకు మనుష్యావతారము చేసినారు?

శి- మనకొరకు.

గు- ఎవరికొరకు పాట్లుబడినారు?

శి- మనకొరకు.

అర్చ్యశిష్ట దేవమాత మొదలైన అర్చ్యశిష్టవారి వందన వివరము

గు- దేవమాతనున్ను సమ్మనస్కులనున్ను అర్చ్యశిష్టవార్లనున్ను వందించవచ్చునా?

శి- వారు సర్వేశ్వరునికి మహాప్రియమైన వారున్ను, వారియొద్ద అనంతమహిమను స్వతంత్రము చేతపొందినవారున్ను, మనకు ఉపకారియున్ను పుణ్యములోనున్ను ఆ స్థితిలోనున్ను మిక్కిలిగొప్పవారున్నైనుండేటందువల్ల వారిని వందించుట న్యాయము.

గు- వారలను వందించవద్దని వేదములో నిషేధించియున్నదా?

శి- ఎంతమాత్రములేదు. సర్వేశ్వరునికి మాత్రము చేయతగిన ఆరాధన వారలకుచేయుట వేదములో నిషేధించబడినదిగాని వారలకు తగిన వందనముచేయుట నిషేధించబడలేదు.

గు- తిరువళ సర్వేశ్వరునికి చేసే వందనమునకున్ను అర్చ్యశిష్ట దేవమాత మొదలైన అర్చ్యశిష్టవారలకు చేసే వందనమునకున్ను వ్యత్యాసమున్నదా?

శి- చాలా వ్యత్యాసమున్నది.

గు- సర్వేశ్వరునికి చేయబడే వందనమేమి?

శి- పూజ బలి మొదలైన దేవారాధనలు.

గు- దేవారాధన అర్చ్యశిష్ట దేవమాతకును మొదలైన అర్చ్య

## స్వరూపవందన వివరము.

గు. తిరుస్వరూపములు పటములు అర్చ్యశిష్టవస్తువులనబడేవేవి?

శి. జేసునాథునిన్ని అర్చ్యశిష్టదేవమాత మొదలైన అర్చ్యశిష్ట వారినిన్ని మనకు జ్ఞాపకము పుట్టించే స్వరూపములు పటములు వారిసంబంధమైన అర్చ్యశిష్టవస్తువులు మొదలయినవి.

గు. స్వరూపములను చేయవద్దని సర్వేశ్వరుడు నిషేధించలేదా?

శి. అజ్ఞానులు చేసినట్లు అబద్ధమైన దేవుండ్లుగానున్న వార్లగురుతులుగానున్న విగ్రహములను చేయుటనున్ను ఆరాధించనున్ను మాత్రము సర్వేశ్వరుడు నిషేధించి తిరుస్వరూపములను చేయుట వేరే విధించినారు.

గు. జేసునాథుని దేవమాత అర్చ్యశిష్టవారల ఏదొక ప్రాణగుణమైనను తిరుస్వరూపములయందు కలిగియుండునా?

శి. లేదు. తిరుస్వరూపములు జేసునాథునికిన్ని దేవమాతమొదలైన అర్చ్యశిష్టవారికిన్ని గురుతులై యుండుటగాక మరియొకటి కాదు.

గు. అలాగుండగా తిరుస్వరూపముల యెదుట వేడుకొనుట యెందుకు?

శి. అవి జేసునాథున్ని మాతవారులనున్ను రూపుగా చూపించేటట్టు జ్ఞాపకపరిచేయిందువల్ల అధికభక్తి మనోరాగ అవధానముతో వేడుకొనేటందుకు వాటిముందట ప్రార్థించుట యుక్తమైన ఆచారమవును.

గు. అలాగు స్వరూపములయెదుట ప్రార్థించేటప్పుడున్ను భక్తి వందనము చేసేటప్పుడున్ను ఆ జపస్తోత్రవందనము స్వరూపములకు చేయుటగాదా?

శి. ఎంతమాత్రముకాదు, ఆజపస్తోత్రవందనమంత స్వరూ

ములచేత కనపరచబడే జేసునాథునికిన్ని అర్చ్యశిష్టవాళ్లకు న్ను చేయబడి వాళ్లకు చేరేదిగాని స్వరూపములలో నిల వదు.

గు- అలాగునుండగా తిరుస్వరూపములకు వందనము చేయుట న్యాయమా?

శి- అవి వేదసంబంధమున్ను జేసునాథునికిన్ని అర్చ్యశిష్ట వారికిన్ని గురుతులై యున్నందుచేతనున్ను స్వరూపములకు చేయ బడే వందనమున్ను అవమానమున్ను వాటివల్ల కనపరచబ డేవారికి చేయబడునదిగా నున్నందుచేతనున్ను వాటినిపైన చె ప్పినలాగు వందనము చేయుట న్యాయమైన ఆచారమే. మరిన్ని సర్వేశ్వరుడే అనేకమార్లు గొప్ప అద్భుతములచే స్వరూపములను ముఖ్యపరచినారు.

గు- అదిగాక తిరుస్వరూపములచేత వచ్చేజ్ఞాన ప్రయోజన మేమి?

శి- జేసునాథున్ని దేవమాతనున్ను తక్కిన మోక్షవాసుల నున్ను వారియొక్క సుకృతమాతృకలనున్ను ఆనందమహి మనున్ను మనకు జ్ఞాపకపరిచినందువల్ల అవి దేవభక్తి చురు కు మోక్షపురిక మొదలయిన సుకృతపట్టువలను మనయందు పుట్టించి పెంచుట మనకు మహాప్రయోజనమే. అందుకొరకు విశేషముగా వాటిని మన్నించుట సత్యవేదాచారమై యు న్నది.

## Litany of B. V. M.

## దేవరతల్లి ప్రార్థన.

---

కిరియే ఎలేయిజోన్

క్రిస్తె ఎలేయిజోన్

కీరియే ఎలేయిసోన్
క్రిస్తె ఔదినోస్
క్రిస్తె ఎక్సౌదినోస్
పాతెర్ దెచేలిస్ దేయూస్ మిసెరెరెనోబిస్
ఫిలిరదెంతోర్ ముందిదేయూస్
స్పిరితుస్ సాంక్తెదేయూస్
సాంక్తాత్రినితాస్ ఊనుస్ దేయూస్
సాంక్తామరియా
సాంక్తాదేయిజెనిత్రిక్స్ .
సాంక్తావిర్గోవిర్జినుం
మాతెర్ క్రిస్తి
మాతెర్ దివినగ్రాసియే
మాతెర్ పూరిస్సిమా
మాతెర్ కస్తిస్సిమా
మాతెర్ ఇన్వియొలాతా ఒరాప్రోనోబిస్
మాతెర్ ఇంతెమేరాతా
మాతెర్ అమాబిలిస్
మాతెర్ బోనికొంసీలియి
మాతెర్ క్రియతోరిస్
మాతెర్ సాల్వతోరిస్
విర్గోప్రుదెంతిస్సిమా
విర్గోవెనెరాందా
విర్గోప్రిదికాందా
విర్గోపోతెన్స
విర్గోక్లెమెన్స

వీర్గో ఫీదెలిస్
స్పేకులుంయూస్తిసియే
సేదెస్ సాప్పిఎన్సియే
కౌసానోస్త్రెలెటిసియే
వాస్ స్పిరితువాలే
వాస్ఓనోరాబిలే
వాస్ఇన్సిగ్నేదెవోసియోనిస్
రోసామిస్తికా
తూర్రిస్దవీదికా
తూర్రిస్ ఎబూర్నేయా
దోముస్ఔరెయా
ఫేదెరిస్ఆర్కా
యానువచేలి
స్తెల్లామత్తుతీనా
సాలుస్ఇన్ఫిర్ మోరుం
రెఫూజియుం పెక్కాతోరుం
కోంసోలాత్రిస్ అఫ్లిక్తోరుం
అవుక్సిలియుంక్రిస్తియానోరుం
రెజినాఅంజెలోరుం
రెజినాపాత్రియార్కారుం
రెజినాప్రోఫేతారుం
రెజినా అపోస్తోలోరుం
రెజినామార్తిరుం
రెజినాకొన్ఫెస్సోరుం
రెజినా వీర్జినుం

రేజినా సాంక్తోరుం ఓమ్నియుం
రేజినా సీనేలాబె ఒర్జినాలి కొంచెప్తా
రేజీనా సాక్రతిస్సిమి రోసారియీ
రేజినా పాచిస్
అగ్నుస్ దేయి క్వి తోల్లిస్ పెక్కాతముంది
పార్చె నోబిస్ దోమినే
అగ్నుస్ దేయి క్వి తోల్లిస్ పెక్కాతముంది
ఎక్సాదినోస్ దోమినే
అగ్నుస్ దేయి క్వి తోల్లిస్ పెక్కాతముంది
మిసెరేరె నోబిస్.
గు. ఓరా ప్రొనోబిస్ సాంక్త దేయి జెనిత్రిక్స్
ఠి. ఉత్ దిగ్ని ఎఫిచ్యామూర్ ప్రొమిస్సియోనిబుస్ క్రీస్తీ

## O Salutaris Hostia.

### ఓ సాలుతారిస్ హొస్తియా

ఓ సాలుతారిస్ హొస్తియా
క్వె చేలి పాండిస్ ఓస్తియుం
బెల్లా ప్రెముంత్ హొస్తిలియా
దా రోబుర్ ఫెర్ అవుక్సిలియుం
ఊని త్రినోక్వె దొమినొ
సిత్ సెంపితెర్న గ్లోరియా
క్వి వితం సినె తెర్మినొ
నోబిస్ దోనెత్ ఇన్ పాత్రియా. ఆమెన్.

# Laudate Dominum.

## లౌదాతె దోమినుం.

లౌదాతె దోమినుం ఓమ్నెస్ జెంతెస్
లౌదాతె ఏయుం ఓమ్నెస్ పోపులి
క్వోనియం కోంఫిర్మాతా ఎస్ట్ సూపెర్ నోస్
మిసెరికోర్దియా ఏయుస్
ఎత్ వేరిత్తాస్ దోమిని మానెత్ ఇన్ ఎతెర్నుం
గ్లోరియా పాత్రి ఎత్ ఫీలియో ఎత్ స్పిరితుయి సాంక్తో
సీకుత్ ఎరాత్ ఇన్ ప్రిన్సిపియో ఎత్ నుంక్ ఎత్
సెంపెర్ ఎత్ ఇన సెకుల సెకులోరుం ఆమెన్.

---

J. M. A.

## పివ్యాప్రాజ పత్రాసు మంత్రములు.

గురువు ఇంత్రోయిబో,
శిష్యుడు అద్దేయుం క్వి లెతిఫికాత్ యూవెన్ తుతేం మెయామ్.
గు- యూదికమె,
శి- క్వియ తు ఏస్ దెయుస్, ఫోర్తితుదొ మెయ క్వారె మె రెపు
లిస్తి? యత్ క్వారె, త్రిస్తిస్ ఇన్చెదోదుం అఫ్లిజిత్ మె
యినిమికుస్?
గు- ఎమిత్తె లూచెమ్,
శి- ఎత్ ఇంత్రోయిబో అద్ అల్తారె దెయి, అద్దేయుం

క్రుశిఫికాత్ యూదెస్ తు తెమ్ మేయామ్,

గు- కోన్ఫితెబోర్,

శి- స్పిరయిన్ దెయొ, గ్లోరియసామ్ అద్యూక్ కోన్ ఫిసొర్
యుల్లి, సలుతారె వుల్ నుస్ మెయి, సిత్ దె యుస్ మెయుస్,

గు- గ్లోరియ పాత్రి,

శి- సీకుత్ యెరాత్ ఇన్ ప్రించిపియొ, ఎత్ నుంక్, ఎత్ సింపెర్,
ఎత్ ఇన్ సెకుల సెకులోరుమ్, ఆమెన్

గు- ఇంత్రొయిబొ,

శి- అద్జుయుం, క్రుశిఫికాత్ యూదెస్ తు తెం మెయామ్.

గు- అద్యుతోరియుం,

శి- క్వాషిత్ చెలుమ్ ఎత్ తెర్రామ్.

గు- కోన్ఫితెమొర్,

శి- మిజెరెయతుర్ తుయి ఓమ్నిపొతెన్స్ దెయుస్, ఎత్ దిమి
స్సిస్ పెక్కాతిస్, తుయిస్ పెర్దుకాత్ అద్విత్తామ్ ఎతెర్-
నామ్.

గు- ఆమెన్

శి- కోన్ఫితెయొర్ దెయొ ఓమ్నిపొతెంతి, బెయాతె మరి
యెసెంపెర్ విర్గిని, బియాతొ మిఖయేలి అర్కాంజెలొ,
బియాతొ యొవాన్ని బాప్తిస్త, సాంక్తిస్ అపోస్తొలిస్ పెత్రొ
ఎత్ పౌలొ, ఓమ్నిబుస్ సాంక్తిస్, ఎత్తిబి పాతెర్, క్వియ
పెక్కావి నిమిస్ కోజితసియొనె, వెర్బొ, ఎత్ ఓపెరె,
మెయా కుల్ప, మెయా కుల్ప, మెయా మగ్జిమ కుల్ప ఇదెయొ
ప్రెకొర్ బెయాతామ్ మరియామ్ సెంపెర్ విర్జినెం,
బియాతుం మిఖయేలెం, అర్కాంజెలుం, బియాతుం యొ
వాన్నెం, బాప్తిస్తాం, సాంక్తోస్, అపోస్తొలోస్. పెత్రుం ఎత్

పౌలుం, వోమ్నెస్ సాంక్టోస్ ఎత్తెపాతెర్, వోరారెప్రోమె
అడ్డోమినుందేయుం నోస్త్రుం,

గు- మిజరేయతూర్,

శి- ఆమెన్.

గు- ఇన్దుల్జెన్సియామ్,

శి- ఆమెన్,

గు- దేయున్ ... ... ... ... ...

శి- ఎత్ ప్లెబ్సుతుయ లెతబితుర్ యిన్ తె.

గు- వోస్తెందె నోబిస్ ... ... ...

శి- ఎత్ సలుతారెతూయుం దనోబిస్,

గు- దోమినె,

శి- ఎత్ క్లామోర్ మెయుస్ అద్ తె వెనియాత్,

గు- దోమినుస్,

శి- ఎత్ కుం స్పిరితుతువో,

గురువు పీఠమువిూదికి వెళ్ళుట.

గు- కిరియెయెలె యిసాన్

శి- కిరియెయెలె యిసాన్

గు- కిరియెయెలె యిసాన్

శి- క్రిస్టెయెలె యిసాన్

గు- క్రిస్టెయెలె యిసాన్

శి- క్రిస్టెయెలె యిసాన్

గు- కిరియెయెలె యిసాన్

శి- కిరియెయెలె యిసాన్

గు- కిరియెయెలె యిసాన్

గురువుగ్లోరియా చదివినతరువాత జనులవైపుతిరిగి.

గు- ధోమినుస్,

శి- ఎత్ కుం స్పిరితుతువో,

గురువు నిరూపముచదివి ముగిసినవెంటనే.

శి- డెయొగ్రాసియాస్,

గురువు సువిశేషము చదువుటకుముందు.

గు- దోమినుస్,

శి- ఎత్ కుం స్పిరితుతువో,

గు- సెక్వెన్సియ,

శి- గ్లోరియాతిబి దోమినె,

గురువు సువిశేషము చదివి ముగిసిన వెంటనే.

శి- లాస్ తిబిక్రిస్తె,

గు- దోమినుస్,

శి- ఎత్ కుం స్పిరితుతువో,

గు- ఓరాతెఫ్రాత్రెస్,

శి- సుష్సిపియాత్ దోమినుస్ సాక్రిఫిసియుందెమానిబుస్ తు యిస్ అద్‌లాదెం ఎత్ గ్లోరియాం నొమినిస్ సుయి, అద్ ఉతిలితాతెం క్వోక్వెనొస్త్రాం, తో సియుస్ క్వె ఎక్లెసియె సుయెసాంక్తె.

గు- పెర్ ఓమ్నియా,

శి- ఆమెన్,

గు- దోమినుస్,

శి- ఎత్ కుం స్పిరితుతువో,

గు- సుర్సుంకోర్డా,

శి. హాబెమున్ అద్డొమినుం,
గు. గ్రాసియాస్,
శి. దిజుం ఎత్ యుస్తుంయెస్త్,

---

గు. పెర్ ఓమ్నియా,
శి. ఆమెన్,
గు. పాతెర్ నోస్తెర్,
శి. సెద్ లిబెరనోస్ అమాలో,

గు. పెర్ ఓమ్నియా,
శి. ఆమెన్,
గు. పాక్సుదోమిని,
శి. ఎత్ కుంస్పిరితూతువో,

గు. దోమినుస్,
శి. ఎత్ కుం స్పిరితుతువో,
గు. ఓరెమున్,

గు. దోమినుస్,
శి. ఎత్ కుం స్పిరితుతువో,
గు. యీాతె, మిస్సయెస్, లేత, అగమన, తపన్ను, కాలములో
బెనెదికమున్ దోమినో,
శి. దెయొగ్రాసియాస్,

---

గు. దోమినున్,
శి. ఎత్ కుం స్పిరితుతువో,

గు- ఇనిసియుం,
శి- గ్లోరియతిబి, దోమినె,
శి- బెనెడికామిసియాస్,

### పడిపూజపాట.

రాగము: సౌరాష్ట్రము.—రూపకతాళము.

పల్లవి

వేంచేసిరయ్యా । జేసునాథుడు, వేంచేసిరయ్యా॥

అనుపల్లవి

వేంచేసిరయ్యా । వేదలిపినెరవేర
వంచితపాపుల । సంరక్షింపవడోడగి

చరణములు

ఆదాముపాపము । నట్టెపోగొట్టగా
సాదరమతితోడ । సర్వేరక్షకవృత్తి॥ వేం॥
మదముబట్టినదుష్ట । మనుజులనేలగా
సదయురాలగు మరియ । చానగర్భమునుండి॥ వేం॥
జనులదుఃఖముపోవ । జేసిరక్షింపగ
తమరక్తముమపుడము । దపియుబంధింపగ॥ వేం॥
హేరోదుమర్మము । రెత్తిపోవగజేయు
బారిమెజిప్తను । పరభూమికరుగగా॥ వేం॥
మరణవేళలోవచ్చి । మనుజులనెల్లను
పరమపదవిజేర్చ । భారముతమదని॥ వేం॥

## ౨ పాట.

రాగము కాంభోజి, ఏకతాళము.

పల్లవి॥ జేసునాథుని మందుగొనరే ఓ జనులారా
బహురోగములుమానును

చరణములు.

జేసునాథునిమందుగొనరే । శాశ్వతజీవమిచ్చుమందు॥
మోసదురాశలకు వినాశకరమైమందు॥ జేసు॥
కడుదూరికొండలవంటి కలుషములు హరియించు మందుకలిమిగా
నుజనులకు కవ్య మరయనుతునిమందు॥ జేసు॥
ఇష్టమైనవారికి దేవయిష్టప్రసాదము నిచ్చుమందు । ఇష్టముకాని
వారికెల్ల యిందదావిందుమందు॥ జేసు॥
తారకమనియెడు దేవతనయప్ప్రసాదముమందు కామసముల
ణచి తనలోకాన తెలిసి తీయుమందు॥ జేసు॥
ఆశగలవారికెల్ల అమృతసారమై యుండుమందు । ఆత్మకునారో
గ్యమైన ఆయేసునాథునిమందు॥ జేసు॥
ఎంతదరిద్ర్యమిచ్చి వంతమెంతజేసిన తొరకనిమందు । సంతతసంత
ర్పణమైన అంతఃపురములోనుండెడిమందు॥ జేసు॥